# సర్వేశ్వరశతకము

చెముడుపాటి వేంకట కామేశ్వరకవి

ప్రణీతము



మొదటికూర్పు 1000 ప్రతులు.

పిఠాపురము

శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల

1931.

వెల రు 0-4-0 లు.

# అవతారిక



ఈ గ్రంథమును రచించిన బ్రహ్మశ్రీ చెముడుపాటి కామే శ్వరకవిగారు నాకు బాల్యమిత్రులు. వీరికిఁ గవితాశక్తి పూర్వ వయస్సున లేకుండెను. ఉత్తరవయస్సుననే కలిగినది. ఒకానొక సద్గురువు వీరికి తత్త్వరహస్యముల నుపదేశించెను. శ్రవణమనన నిధిధ్యాసములచే నారహస్యముల నీతఁడు సాధించుకొనుచుండఁ గా దైవికముగా గవితాశక్తి యంకురించినది. దానిమహిమచే నీకవి యీశతకము రచించి, స్వానుభవమును లోకమున వెద చల్లెను. భక్తు లిందలివిజ్ఞానమును స్వానుభవమునఁ బరీక్షించి, సంతసింతురుగాక.

బాల్యముననుండియును హూణవిద్యమాత్రమే యభ్య సించి, రాజకీయోద్యోగమునందే తనజీవితమును గడపుచున్న శ్రీకామేశ్వరకవిగారు సద్గురుకటాక్షమునను, సద్వాసనాబలము నను, సత్కవిగాఁ బరిణమించుట దైవబలమును సూచించు చున్నది.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి.



శ్రీరామాయ నమః

శ్రీగణాధిపతయే నమః

శ్రీగురుభ్యో నమః

# శ్రీ సర్వేశ్వర శతకము

---

మ. చదువాలేదు; పురాణమన్న నెఱుఁగన్ శాస్త్రంబదెట్లుండునో
పదమాత్రోఁ చదు; శయ్యావృత్తి యెఱుఁగ న్పద్యంబులల్లంగఁగో
విదుఁడన్ గానిఁక; దప్పులన్ విడిచి తృప్తిన్ నాదుపద్యాళిలోఁ
దుదిపాదంబుననొప్పునామసుధ నెంతో గ్రోలి, నాదండముల్
పదివేల్ గైకొని, భక్తులార! తరియింపన్ మిమ్ము నేవేఁడెదన్.

శా. శ్రీరామామణి వామభాగమునసంసేవింప, సామీరి యిం
పార న్గొల్వఁగ, సీత! యీావవనజుండాప్తుండు నాకౌట, సాం
పార స్వీనికిఁ దత్త్వముం దెలుపుమాయంచుం గృపన్బల్కు సీ
తారామాకృతినొప్పుబ్రహ్మమును నిన్ ధ్యానింతు సర్వేశ్వరా

శా. తల్లిన్ ; వ్యక్తతనొందికోర్కి వాడమున్♦దాదాత్మ్యమున్బొందితా
నల్లంతన్ ద్రిగుణాత్మకత్వమున వే♦త్తై, తృప్తి గాకున్కిచేఁ
దెల్లంబై, పరుఁబొంది, యీశుఁగని యెం♦తేవానికిన్ బ్రీతిమై
నిల్లాలై భవమొందు దేవి మదిలో♦ నేఁ గొల్తు సర్వేశ్వరా.

శా. ఆధారంబుపయిన్, షడక్షరయుత♦ప్రాంచద్దళోపేతమై
బోధబ్రాహ్మ్మసకామబీజములచేఁ♦బొల్పొంది తా నిత్యమున్
సాధిష్ఠానవిధాతమై సుధితర♦మ్యంబా నుపస్థాశ్రిత
స్వాధిష్ఠాననివాసమొందుజననిన్♦బ్రార్థింతు సర్వేశ్వరా. 3

మ. తనరన్ గౌరికి నర్ధదేహమిడ సం♦తాపించు గంగన్ శిరం
బున నెక్కించుక యూఁరడించియును ని♦ర్మోహాత్ముఁడై, సంపద
ల్లనియన్ భక్తులకిచ్చి పైఁడివలువల్♦దాసాళి కర్పించి యం
తనుభిక్షుండయి, భూతి మైనలఁదియా♦నందాకృతిం దాల్చు నా
మునివంద్యున్బరమాత్ముఁ గొల్చెదమనన్♦బ్రోవంగ సర్వేశ్వరా.

మ. కరిరాజాస్యుని నాఖువాహనవిభున్♦ గౌరీమనోద్భూతు నా
గురగాలంకృతుగుజ్జువేలుపును వి♦శ్వోత్పత్తికారున్ హరున్
బరిపోషున్ బురుషున్ వినాయకుని స♦ద్భక్తిన్ సదాగొల్చి నే
విరచింతున్ శతకంబుఁ; జేయుమది ని♦ర్విఘ్నంబు సర్వేశ్వరా.

శా. శాంతున్నిత్యశమాదిషట్కనిరతున్♦సత్పాత్రునిష్కృత్తు, శ్రీ
కాంతావల్లభపాదుకాంచితశిరున్♦ గాంభీర్యయుక్తున్, గపిన్
స్వాంతంబందు భజింతు నే నుపనిష♦త్సంపూర్ణపాండిత్యు, ధీ
మంతున్, మారుతి, మత్కృతిన్ సతతమున్♦మన్నింపస రా

మ. ధర నన్నాదికవిన్, గవిత్రయమునిన్, బో♦తన్నన్ సుతుల్సేసి భా
స్కరునిన్, బెద్దన్ననున్, దిమ్మనాదికవుల♦న్సత్సంగుల న్గొల్చుచున్
బరమార్థంబయి, భక్తిబోధయుతమై♦ వైరాగ్యమై యొప్ప నీ
ధర శార్దూలమదేభవృత్తశతప♦ద్యంబుల్ సుహృద్యంబుగాఁ
బరమాత్మా! రచియింతుఁ, బుత్రుఁడనున♦న్బాలింపు సర్వేశ్వరా.

మ. ధనమున్నంతనె బంధులాశ్రితజనో♦దారస్తుతుల్ దర్పముల్
ఘనతల్ గౌరవముల్ పరాకులును, మూ♦కత్వంబు, బాధిర్యమున్
ఘనమానాంధత, కోపము, న్బహుళరా♦గంబు న్నరుం బొందు నం
తనునిన్గానక మిత్రుఁ బాసి, తనుకాం♦తాలోలతన్ సంసృతిన్
గని, కర్మార్తిని బొందు నిర్ధనుఁడ న♦న్గాపాడు సర్వేశ్వరా.

మ. వలమానంబగుగానుగెద్దు బలెఁ గై♦వారంబులం జేసినన్
దలక్రిందై ఋషిపక్షిభంగిఁ దపమున్♦ దాఁ బూని ఘోరాటవిన్
ఫలమూలాశనుఁడైనఁ గామి నిజరూ♦పజ్ఞానియై, ముక్తుఁడై
నెలయం జాలునె? భక్తిశూన్యభవముల్♦ వేయేల సర్వేశ్వరా.

శా. మానాంబేధిమురాశ్రమున్ డిల్లింప♦స్మార్తంబుదానొందు యద్వైత
ధ్యానానందమతండపానమదమ♦త్తుం బైన నాచిత్త మే
దానింగోరక, చోద్యమొప్ప విపశ♦త్వంబందియున్ లౌకికా
జ్ఞానం బించుక యొప్పఁ బొందఁదగవా♦ సర్వజ్ఞ! సర్వేశ్వరా.

మ. పరకాంతాధన మన్న పీడను, సురా♦పానంబుతోఁ బుట్టినన్
బరనిందాన్వితచౌర్యహింసలు దలం♦పన్ వాన్నతోఁ బట్టినన్

బరిపోషించెనుదల్లి; హత్యలుతృణ♦ప్రాయంబుగానెంతు; న్
దరిఁజేర్ప న్భరమంచునెంచకుము నీ♦దాసుండ సర్వేశ్వరా. 11

శా. ఎన్నోపాపములాచరించితిఁజుమీ ♦ హీనుండ, నీయాన; నీ
వన్న న్నీకథలన్న భీతి; గరళం♦బౌసుమ్ము సద్గోష్ఠి; కన్
సన్నల్సేయుఁ బరాంగనంగని, వధల్♦జన్నంబులై యొప్పు న
న్ననా! యేవిధిఁబ్రోచెదో, కరుణనా♦యందుంచుసర్వేశ్వరా.

మ. జననీగర్భజరక్తసంకలనఁ దే♦జం బేర్పడన్, గాయమై
తనరన్, దానినిఁజేరి, శోణితముమ♦ధ్యందేలుచున్ గుందుటన్
నిను ధ్యానించినదెంతొకాని, మఱి నే♦నీధ్యానము న్మానితి
న్ననుఁబాపింగనుమానసంజగము, నిన్♦ధ్యానింతు, సర్వేశ్వరా

శా. క్రీడ న్బాల్యము, యౌవనంబుకనకాం♦గీలోలతన్ సంసృతి
న్వేడంజాలక కాంచనంబునకును♦వ్వెళ్లారుటం జేసి, ని
న్వేఁడన్మానితి; నెంతమూఢుఁడను! నన్♦విశ్వేశ! సైరించి, నీ
వాఁడ న్గాఁవఁ బ్రోవుమంటి; నిఁకనా♦భాగ్యంబు, సర్వేశ్వరా.

మ. పరకాంతన్గని మ్రొక్కువారలను, సం♦ప్రాప్తాన్నదానంబుచే
నిరుపేదన్బరితృప్తిచేయునరులన్ ♦ నీభక్తులన్, యోగులన్,
బరనిందాహితదూరులన్, గొలుతునే♦వారిన్, భవద్రూపులన్,
శరణార్థిన్ననుఁబ్రోవు కొల్చెదను నిన్♦సంప్రీతి, సర్వేశ్వరా.

మ. పొరి నేఁ జేయుచు వేనవేలు దురితం♦బుల్, వీతభీతుండనై
తిరుగన్, నీవు విశిష్టభూతదయబు♦ద్ధిం జొన్ప నాకంటికా
దురితంబుల్ పెనుగొండలై పొడమె; చే♦తోవీథి భీతిల్లినేఁ

బరితాపంబునఁ గుంది, దీనమతినై ప్రార్థించి, నీకెల్లెడన్
గరయుగ్మంబును మోడ్చి మ్రొక్కెదను నన్గాపాడు, సర్వేశ్వరా.

మ. జననీగర్భముఁ జేరుటాదిగను నోజన్ రేలు మాపుల్ ననున్
గనుచుం గంటికి ఱెప్పలాగున సదా కాయంబునం దుండి, నా
పనులన్ సాక్షిగఁ జూచు నిన్నెఱుఁగకే పాపంబులం జేసితిన్;
దనయుం డన్నద తప్పు సైచి కనుమీ ధ్యానింతు, సర్వేశ్వరా.

మ. నిగమాంతార్థము లెస్సగా నెఱిఁగి నిన్ నిత్యంబు సేవించు నా
విగతక్రోధుల, వీతపాపమతులన్ విద్వాంసులన్ బ్రోచు టే
తగు కార్యంబన గొప్ప కాదు; నను హంతవ్యున్, మహాపాతకున్
దగ నోదార్చుచుఁ బ్రోవు; నీకృపయు వాత్సల్యంబునున్ భేరిపై
జగతీమండలి యాదరించి విన నేఁ జాటింతు, సర్వేశ్వరా.

మ. ధరశాస్త్రంబు లనేకముల్సదివి, ప్రస్థానత్రయార్థంబులన్
బరిపూర్ణుండగు పండితుం డయిన, నింపారన్గురుం గొల్చి తాఁ
బరతత్వంబు గ్రహించి, నిష్ఠఁ బరతన్ బ్రహ్మాత్ముఁడై తన్నుఁ దా
బరగం గాంచినఁగాని ముక్తిఁ గను నే వ్యర్థుండు, సర్వేశ్వరా.

మ. తనువింకేడనొ! తానదేడనొకొ! స్వాతంత్ర్యంబు తానేడనో!
ధనకాంతామణు లేడ! బంధువులు మా తాపుత్రులింకేడనో!
తనవెంటన్ దుదిరాఁ డొకండు తగ స్వార్థం బిచ్చి పోషింపి[illegible]
గనఁగాఁ దావకనామకీర్తనము తక్కం దిక్కు వే[illegible]లే
దని స్వాంతమ్మున నమ్మి కొల్తు నిను నిత్యంబేను, సర్వేశ్వరా.

కార్పణ్యం బది నీకు నాపయిని ? నా♦కర్మం బెటులుండంగ, నీ
కారుణ్యంబుకణంబు వెట్టినయది నేఁ♦గాంక్షింతు, సర్వేశ్వరా.

శా. ఎంతో కాల మహర్నిశం బడిగి నే♦నెంతేడ్చినన్, నీకు ర
స్వాంతం బైనం దయరాదు; నాదురితముల్ ♦వాపంగ రావట్టివే ?

వింత ద్వ్యాస్, వికటంబొ హాస్యమొ నిరూ♦పింపంగ లేకుంటివి, నా
స్వాంతంబూరడిలు జిదంబరరహ♦స్యం బెద్దియో చెప్పి, నా
చింతల్ వాపు; తరింతు దాన, నిఁక నీ♦చిత్తంబు, సర్వేశ్వరా.

మ. పతితాత్ముండను, జాతకుండననుఁ బో♦వంజాలం బొమ్మంచు నీ
పతికారుణ్యము లేదె చేల ? మహనీ♦యా ! నీదు నామంబు నా
గతజన్మార్జితపుణ్యశేషఫలమై ♦ కర్ణంబులన్ సోఁక, నా
పతితత్వం బది వీడె; వీడనిఁక నీ♦పాదంబు, సర్వేశ్వరా. 27

మ. వినుతుల్ సేయుచు వేఁడి నిన్నుఁ దుది నే♦వేసారి నో నాతిథిన్
ఘనమందన్యుల వేఁడ భక్తుఁడను నీ♦మంత్రంబె ధ్యానింతు, నీ
జనకన్యాయము జూపి, తప్పులను వే♦సైరించి సన్ బ్రోవుమీ
తనయుల్ నీవు దయాళుసామి యది త♦థ్యంబేని, సర్వేశ్వరా.

మ. స్థిరమై, శాశ్వతమై, కళా సకలమై♦ లీనమై, మహానందమై,
పరమై, పావనమై, పరాత్పరమునై ♦ప్రద్యోతమై, పూజ్యమై,
శ్రుతివై మోహనమై మునీంద్రహృదయా♦మోదంబునై మోక్షమై
సురసేవ్యంబఖిలార్థసాధనమునై, ♦ సుశ్లోకమై, సూక్ష్మమై,
పురుషార్థంబగు నీదుమంత్ర మిదె నా♦ పుత్రుండు, సర్వేశ్వరా.

మ. ధనికుండు, న్ధనహీనుఁడుం, స్థవిరుఁడు♦న్దారుణ్యసంయుక్తుఁడు
న్దనువైకల్యయుతుండు, సుందరుఁడు, చం♦డాలుండు, విప్రుండుదా
ననఁగా నొక్కఁడె నీకుఁ, దథ్యమిది, భ♦క్తాధీన ! నీభక్తులన్
వెనువెంటఁజనిపోతువంచుఁగొలుతున్♦వేప్రోవుసర్వేశ్వరా.

మ. హితుఁడన్మిత్రుఁడ; నున్నతుండనుమహా♦హీనుండవిద్వాంసుఁడ
న్నతకాయుండఁ, గురూపి, రూపసినట♦న్నన్ జాలిఁదాఁబొందునే?
సతముం గాలమువేచి చంపునెపుడో♦జాగొందఁగీడొందు; నా
గతి వోజ్ఞానమొసంగి సత్కృపనున♦న్గాపాడు, సర్వేశ్వరా.

శా. నీనామంబు పఠించి నిన్నుఁగొలువన్♦నిన్వేఁడఁగాఁ బ్రీతిమై
యానందాశ్రుపరంపరల్ వెడలె జా♦లై; చిత్తముత్కృష్టమై
యానందంబునఁజొక్కెఁజేష్టలుడిగెన్♦హా! మానమున్వీడె; నా
మేనెల్లన్ బులకల్జనించె; వరదా !♦మేలెంచినన్బ్రోచి, యీ
యానందస్థితి నన్ను నిల్పఁగదవే♦యర్థింతు, సర్వేశ్వరా. 32

మ. అనయం బింద్రియమాన్యబీజమది యిం♦ద్రాధిష్ఠితంబౌటచే,
మనమేదానికిసూక్ష్మరూపమగుఁ, గా♦మంబుందదుద్రేకతన్
జననంబై విషయోద్ధతిం బెనిచి దు♦శ్చారిత్రులన్ జేయదే?
ఘనమౌ నింద్రియనిగ్రహంబొసఁగినన్♦గాపాడు, సర్వేశ్వరా.

శా. రూఢిన్ శుక్లముసూక్ష్మరూపమున మైఁ♦బ్రోగౌటచేఁగామమై
గాఢంబై విషయోద్ధతిం బొరలి భం♦గంబై రతిందేలుచున్
మూఢంబై, భవచక్రవిభ్రమణము♦న్మోహించుఁ, గెల్పొందఁగా
గాఢజ్ఞానవిరాగభక్తులిడి నన్♦గాపాడు సర్వేశ్వరా. 34

మ. తనయుల్ భ్రాతృకళత్రమిత్రులును దాఁ దల్లిదండ్రులున్నిత్యతే
తనబంధంబులె బంధులయ్యె నని తాఁ దత్కారణంబౌ సతీ
కనకంబుల్ మది రోసి సద్గురుల సత్కారుణ్యముం బొందినం
దనయందుం దనుఁ గాననేర్చి కనుఁబో తాముకి సర్వేశ్వరా.

మ. సుదతీబంధులు కల్మినాఁటికె, సుహోశుభ్రంబుగాఁ బెంచినన్
దుదకీదేహము కాటికే, ధనము దెంతో కూర్చినం గాటికే
గద! నా కేఁటికి? బూటకం బిది, సదుఃఖం బింద్రజాలంబు; పా
పుదయుక్ జన్మము, వద్దు వేసరితి, నిన్ బూజింతు, సర్వేశ్వరా.

మ. అది నాతల్లి సుతుండితండె; యదినా యర్ధాంగి యీతండె తం
డ్రిదినా సోదరియంచు భ్రాంతివిడు, పొమ్మెవ్వారో! వారింతకుఁ
దుది నీవెంటను రారు; నిన్ననలమందు న్వైచి పోఁజూతురే
కద! యంచు న్మది బోధచేసి నను వేఁ గాపాడు, సర్వేశ్వరా.

మ. పుడమి న్మానవజన్మసంభవము తాఁ బుణ్యంబు; విజ్ఞానముం
బడయం ధన్యత నొందు; నామనసము పాపంబెంచి రాగోద్ధతిం
బడి, కాంతాముఖనేత్రపద్మములపైఁ బాలిండ్లపై నిల్చినల
బోడముం జే;టది మాంసపిండములపైఁ బోనీకు, సర్వేశ్వరా.

మ. మనమా! మర్కటచేష్టమానవు, తిరమ్మాయయున్కిధీవహ్నిచే
తను మోహాటవి దగ్ధమౌనుగద! కాంతాపక్షముం జూడకేం
కను గెంతంగను గొండకాడు; కనఁగాఁ గంపై నమాంసం జేయుం
చనిశంబున్మది నెంచి నిగ్గోలుతు మోక్షార్థంబు, సర్వేశ్వరా.

శా. నానాకర్మభవార్తి నొంద నిల జ♦న్మంబెత్తుటల్ యోనిలో;
యోనిభ్రాంతిని లోభమున్విడిచి నే♦నో దేవ! నిన్వీడ; నో
హో! నీచం బిది, శుక్లశోణితరజో♦యుక్తంబు;కాపాడు, నే
దానన్మ్రగ్గుటఁ దేలుటన్ విసివితిన్ ♦దాసుండ,సర్వేశ్వరా.

మ. పరగ న్గర్మభవార్తిఁ బాపగురుఁడే♦వైద్యుండు,సద్వృత్తి మైఁ
బరయోనిభ్రమణక్షయం బొకటియే♦పథ్యంబు, విజ్ఞానమే
పరమౌమందనుపానమై తగు మహా♦వైరాగ్య,మీమాత్రోపసం
సరణార్తిం దరియించి, దేహి,తుదిమో♦క్షంబందు,సర్వేశ్వరా.

మ. కలదే జ్ఞానము? మాఢ్యమేల? మనమా!♦కామాదులు న్మిత్రులే?
తులువ,ల్శత్రులు,కాలచోదితులు,ధూ♦ర్తుల్ వారుబాహాబలు
ల్కలికిం గాంచనముం ద్యజించి,గురురా♦ట్కారుణ్యమున్బొందిన
న్బొలియున్వర్గమునున్బుధుం,డొసగుమీ♦బోధంబుసర్వేశ్వరా

మ. ఒరులన్దూఱను, మెచ్చఁబోను;ననున♦న్యుల్దూఱభూషింపఁగాఁ
బరితాపంబును మోద మొంద; మదలో♦భక్రోధమోహాదులౌ
నురగవ్రాతముమధ్యఁ జిక్కితిని, నే♦నోర్వంగలే, నిమ్ము, వే
పరిమార్పంగను జ్ఞానగారుడము ని♦ న్బ్రార్థింతు సర్వేశ్వరా.

మ. పరకాంతాధనకాంక్షఁబాపు; మదికిం♦బ్రాప్తంబులౌ వానిచేఁ
బరితృప్తిం గరుణించు; మించుమదలో♦భక్రోధకామాదిదు
ష్కరజీమూతముమధ్యఁజిక్కువడితి ♦ న్గన్పింపదే త్రోవ, యో
వరదా! తోడ్పడి జ్ఞానదీపమిడుమీ ♦ వారింప, సర్వేశ్వరా.

మ. ఖలతృష్ణాఖ్యలతావితాన మతివం♦బ్రాపించి, కామాఖ్యశా
ఖల, లోభాహ్వయపల్లవంబులను, రా♦గవ్యాళయుక్కర్మస
త్ఫలసంధాయకమోహకోరకముల ♦ న్బాసిల్లు; నాపండ్లచేఁ
బులిసెంబండ్లు; భవంబురోసితిని; స♦న్పోషింపు సర్వేశ్వరా.

మ. వరదన్బాఱెడుకట్టెపుల్లలొక-చో♦వర్ధిల్లి యన్యోన్యమై
త్వరలో వీడుఁ బ్రవాహవేగగతుల ♦ న్దత్సంగభంగంబులౌ
కరణిన్ సంసృతిఁ గూటము ల్గలిగి పోఁ♦గర్మానుసారంబుగా
స్థిరమయ్యెన్మది,వంతవాసె, ననునెం♦తేఁ బ్రోవు సర్వేశ్వరా.

మ. ధనమార్జింపఁదలంచుతస్కరుఁ డొగి♦న్దావాఙ్మనఃకాయము
ల్పెనపై చుంగద నిగ్రహంబున; ననుం♦బ్రేమించి, తన్నిగ్రహం
బును,శుద్ధిన్గురుశాంతి,భూతదయయు♦న్బోధించి నిష్కామయా
జునిఁగావించి,భవంబుఁబాపు;తవహృ♦చ్చోరుండ సర్వేశ్వరా.

శా. ప్రాప్తంబౌసుఖదుఃఖముల్ స్వకృతక♦ర్మప్రోక్తమైయంచుని
ర్లిప్తంబై, యభిమానమేది,విషయా♦ళింద్రెంచి, నిర్మోహమై
దీప్తంబౌమది నీపదాంబుజములం♦దే వైచితిన్ దేవ! ధీ
జ్ఞప్తింజూపి కృతార్థుఁజేసి, తుదిమో♦క్షంబిమ్ము సర్వేశ్వరా.

మ. అనయంబన్నలుతల్లిదండ్రులునుస♦ర్ధాంగుల్ సుతుల్ భర్తయు
న్నను సత్యంబుగ నమ్మిరాప్తులధికు♦ల్నా వారు, నాకెన్నఁడిం
పునుబెంపున్గడుఁగూర్తురంచు సతమున్♦బోషించిన,న్వారిపైఁ
గొనముల్లంతచిరాకునొందిన, సిరిన్ ♦ గోల్పోయిసంజూతుశే

నిను? నోనాడికృతఘ్నులై తొలఁగు బల్ ♦ నీచుల్గదే, జీవమా!
కనుమీనమ్మిక చేటుఁ జెచ్చు; మమత ♦ న్ఖండించి సాధింపుమా,
మనముం దొంగలనార్వుర న్గురుకృప ♦ న్మర్దించి మేలొందుమా
యనిబోధించి, యొసంగు నాకు శివజీ ♦ వైక్యంబు సర్వేశ్వరా.

మ. అరయ న్మందమదేభమై సలిలమై ♦ యాధారమై ప్రాణమై
ధరమై, వహ్ని శశాంకఖంబులయి యం ♦ తన్మహానంబై తదీ
శ్వరు కాధారమునై, యహంబుతగవి ♦ శ్వంబై, సతీరత్నమై
తిరమయ్యెన్మది, నేను నాదనెడి భ్రాం ♦ తిన్బాపు సర్వేశ్వరా.

మ. అనని దేహముకర్మసంభవము, దుః ♦ ఖాత్మంబు, రాగోద్భవం
బవుఁగర్మంబభిమానజన్యమదియా ♦ నామానమూహింపఁగా
నవివేకంబహమందుఁబుట్టె బలిసెన్ ♦ నాశించు నిన్నేర్కొనన్
భువిభ్రాంతిన్విడఁబోధమిమ్మహమునే ♦ బోఁద్రోతుసర్వేశ్వరా

మ. ధరలోఁ బ్రాకృతకర్మబోధకముతో ♦ ధర్మంబుల న్నిత్యము
న్నరుఁడాశను ద్రిప్పిఁజూచుఁగాని, కనఁడా ♦ మ్నాయాంతసంవేద్యమౌ
పరతత్త్వం, బనిలక్షధూళికరణిన్ ♦ భాసిల్లు త్రైగుణ్యుఁడా
పురుషుంజూచెడలక్ష్యమిమ్ముగుణముల్ ♦ పోఁద్రోచి సర్వేశ్వరా

మ. కమఠంబంగములన్ శిరంబుముడిసం ♦ కల్పించినంతన్ నినున్
శ్రమఁడానొందకలోనిరిక్షఁ, విషయాసం ♦ సర్గంబటుల్ ద్రోచి, నా
భ్రమపో నింద్రియజాలమే నడఁచి ని ♦ న్వాంఛించువిజ్ఞానమున్
సముబుద్ధిన్ దయచేసి, ప్రోవుసుతు, నన్ ♦ సంప్రీతి సర్వేశ్వరా.

మ. కని,కారుణ్యముమాని,ప్రచ్ఛి,భారియ♦ల్గావించి స్థాత్రి దాఁ
గిమతంబొందకయిచ్చుఁబుష్పఫలముల్ ♦ కేదారముల్గాదె! నా
కనిశం బాపదిఁ గూర్చునాఖిలులకే♦నాతిథ్యముం జూపి, నా
మనముం దుఃఖములంటనీక,యటు,స♦న్మార్గంబునం దుంచి,నన్
గనుమీ,మ్రొక్కెద,తండ్రి!పుత్రుఁడనున♦న్గాపాడు సర్వేశ్వరా.

శా. నానాగంధమిళిందమై తనరి స్పం♦దం బొందియున్ బొందఁడే
దానిం గంధవహుం డసంగుఁడగుటన్ ♦ దద్రీతిసన్ బొందకే
నానావాసన లాశ్రయించిన, ననం♦తా! నేను నిస్సంగినై
యానందింతు నొసంగు నాకు శివజీ♦వైక్యంబు సర్వేశ్వరా.

శా. మోహంబెన్నఁగమృత్యురూపము,మహా♦మోక్షంబె సద్రూప
దేహోదగ్రవికారముల్ సమతబు♦ద్ధిం ద్రెళ్లె,నిర్మోహమై మ్రా
యూహా!శోకముమానె, శాంతమతినే♦హంసస్వరూపాత్మమా
సోహంమంత్రమొసంగు,ముక్తిఁగనెదన్ ♦ జోహారు సర్వేశ్వరా.

శా. ఔరా!ప్రాణదశేంద్రియాన్వితమనో♦హంకారముల్ సుషుప్తిలో
నారాధప్రళయంబునొందఁగఁదనూ♦హార్త్ర్యంబులన్బ్రేమఁ బెం
పారం గాచుచు సంచరింతు వలసో♦హమ్మాచు నీయుంతిసం
సారం బౌటను; మాయథాక కొకవీ♦సంబైన మీఁజంగలే
వారా! కాదనఁ బ్రోవు నన్ను శివజీ♦వైక్యానుసంధాన మిం
పారం దెల్పి; దయామయుండవనెదన్ ♦ హంసాత్మ సర్వేశ్వరా.

మ. క్రతుకోటిన్బసులన్వధించి,ఫలము♦న్గాంక్షించి,చేటొందిరి, నే
గతులంబొందఁగలేరు;కామముఖసం♦ఘాతంబుఁ జిత్తోహ్లాపె

సతము౯ వ్రేల్చుచునాత్మయజ్ఞమతిని♦ష్ఠం జేయునన్బ్రహ్మర్షిమీ
పతివై సద్గురుమూర్తివై, సతము నిన్♦బ్రార్థింతుసర్వేశ్వరా.

మ. మనమాామంత్రి,పురోహితుల్విషయముల్♦త్మాభర్తయే బు
ద్ధియా
జనమాయింద్రియముల్ శరీరపురి, ని♦చ్చ ల్సంచరింమన్గదా
గొనముల్ రాజసతామసాఖ్యఖలులు♦గ్రుల్ వీనిఁబోకార్పనా
ఘనబుద్ధిన్ మదిఁగొల్పి, జ్ఞానశమఖ♦డ్గమ్ముల్ దయన్నాకు ని
మ్మనుచున్వేఁడెద నీదుపుత్రుఁడనునన్♦మన్నింపు సర్వేశ్వరా.

మ. కుబుసంబున్విడ నేర్పికావవె ఫణి౯♦గ్రోధాదిషడ్వర్గము౯
సొబగుంజూప,భ్రమించిచొక్కటనున♦త్తుల్గప్పెఁదత్కంచుకం
బుబిగింద్రోసికనంగనేర్పుమటుఁ‘‘నిర్♦బూజింతు’’విజ్ఞానము౯
బ్రబల౯ దెల్పుగురుండవై పడి‘‘నహం♦బ్రహ్మాస్మి’’యన్వాక్యము
న్విబుధస్తుత్య! భవంబురోసితిని నన్♦వేప్రోవు సర్వేశ్వరా.

మ. జపసంఖ్యాగణనంబునందె చని దీ♦క్షంబూను చిత్తంబు ప్ర
త్యుపకారార్థము ధారవోయుటకు సం♦తోషించిచేటొందదే?
యుపవాసంబుల ప్రుక్కు టిట్లెఫలము♦న్యోజించి;నేనొల్లనా
జపరాజం; బజప౯, సదాద్వాదశమ౯♦చక్రోపవాసంబు, నా
యపరాధంబులసైఁచియిమ్మకడు ని♦న్నర్థింతు,సర్వేశ్వరా.

శా. కాంతాలింగితమానసుల్ వెలికి లో♦కంబెన్న సద్భక్తులై
చెంతందాళమృదంగవాద్యరతుల౯♦జెన్నొందుకామాంధు లే

కాంక్షావాసమతిన్, ద్రికూటముపయిన్ ♦గన్గొందు రేనిన్నదా?
యంతర్వైరుల గెల్వలేని కిటిరూ♦పాగేసరుల్, వ్యర్థవే
దాంతార్థజ్ఞులు; వీరి నొల్లను, భవ♦ద్భక్తుండ, దీనుండ, శ్రీ
కాంతా దర్శనసౌఖ్య మిచ్చిదయ నన్ ♦గాపాడు,సర్వేశ్వరా.

మ. పుడమిన్ మూర్ఖునలేదు మ్రానుతనదా♦పుష్పాంచితశ్రేణుల
న్జడతంగానను నాదుదేహమున, నీ♦శా! యట్లు నీ వుండినన్;
చెడుకామాంధుఁడ; నామనోనయనవి♦క్షేపంబువాపంగ వే
యిడుమజ్ఞానాంజనమున్, సదాకొలిచిని♦న్వీక్షింతు,సర్వేశ్వరా.

మ. నిదురం దోఁచుచుస్వప్నదృష్టభువనా♦నీకంబు సత్యంబుగాఁ,
బిదపం గల్లని తెల్లమౌపగిది, నీ♦పిండాండబ్రహ్మాండముల్
విదితాజ్ఞానజమౌటసత్యముగఁగ♦న్పించున్విమోహాంతమున్
మదివిక్షేపనివారణార్థము,,నహం♦బ్రహ్మాస్మి"యన్వాక్యమున్
సదయా! సద్గురుమూర్తివై తెలుపు, వే♦సంప్రీతిసర్వేశ్వరా.

మ. ధరబింబప్రతిబింబవీక్షణను, ద్వై♦తభ్రాంతి, శ్వేతాద్రిపై
యరుణాభ్రప్రభలీనుటంగన,ననా♦త్మాత్మభ్రమంబంతయున్
కరమన్నింటను గూడు గాద్పుగనసం♦గభ్రాంతిసర్వంబు, నం
బరభేదాపహృతిన్ వికారజనకం♦బౌభ్రాంతి,తామాత్మనిన్
బోరయం జాలవటంచు సద్గురుఁడవై ♦బోధించి విజ్ఞానమున్
గరుణం దెల్పు,సుతుండ,వేఁడెదను,నన్ ♦గాపాడుసర్వేశ్వరా.

మ. అలయజ్ఞానజమై, మనస్తటయుతం♦బై, క్రోధపంకాతిచం
చలమై,మోహతృణప్రకీర్ణమయి,తృ♦ష్ణాసర్పమై,లోభమన్

కలుషంబౌ నది భీతిగొల్పి, విషయో♦గ్రగ్రాహమై పాఱుచున్
గలియన్ సంసృతిసాగరాన, వరదా!♦ కామింతు నీవాహినిన్
తొలఁగం దాఁటఁగ, జ్ఞాననౌక యిదె, సం♦తోషింతు, సర్వేశ్వరా.

శా. జీవుం డెన్నఁ డనాద్యవిద్యకతనన్♦ జేటొందు టన్ గాదె, యో
దేవా! ధీంద్రియజాతమౌ విషయవృ♦త్తిం జిక్కి తల్లోలుఁడై
సేవం జేయుచు సంసృతిం బ్రమసి గా♦సిం జెందుఁ గర్మార్తి, నన్
బ్రోవం జ్ఞాన మొసంగి, లక్ష్యమిదె, నీ♦పుత్రుండ, సర్వేశ్వరా.

మ. కలియున్ బిందువు తాఁగళన్, పిదపశ్యం♦గాటస్థితంబౌ త్రిమం
డలిలో ధీసయనాంతము౦దిగుచు దాఁ♦టన్, జెంతహృత్కంజసం
కలనం దాను బహిర్ముఖంబగుచు, ధీ♦కర్మేంద్రియప్రాణసం
కలుషంబై చెడు, దీనిఁ గావఁగ విరా♦గజ్ఞానభక్తిత్రయిన్
జెలివై యిచ్చి, భవంబుఁ బాపు, పరులన్♦ జింతింప సర్వేశ్వరా.

శా. ఘూమిం బొల్పగు నిత్యవృద్ధిని, మహా♦మోహాఖ్యబీజం బవి
ద్యామూలంబు, ప్రమాదసిక్తమున సూ♦యాపత్రమున్ దుఃఖశా
ఖామోఘంబయి, రాగవల్లికమునై ♦ గత్యంచితోన్నత్యమై
కామాఖ్యోర్వరుహంబు నంచితములా♦గాముల్ఫలంబుల్ తినం
గామించున్మది; లోభినై యెగయ, శా♦ఖల్జాఱఁ గీడొఁగదా!
ప్రేమం జూపి, విరక్తిఖడ్గమిదె, నే♦వేవేగ మావృక్షమున్
స్వామీ! త్రుంచితెరంతుఁ; గావుసుతు, నన్♦ సంప్రీతిసర్వేశ్వరా.

మ. ప్రభఁ జెన్నొందెడిబిందునాదములసా♦భాగ్యోన్నతైక్యంబునం
బ్రభవం బొఁగళ; దీనిఁ గాంచుచుఁ బయిం♦బ్రజ్ఞానియై నిర్వృతిన్

విఘ్నవంబొందినఁగాదెకాంచుఁదనుఁదా◆విద్వాంసుఁడీగుప్తమం
దుభయభ్రష్టత,పై నిసన్న్యసనమున్◆సూక్తిన్ బ్రబోధించి,నా
కభవా! ముక్తి నొసంగుమీ, యితరమేనాశింపసర్వేశ్వరా.

మ. అవికారాత్ముఁడ; బంధుసంగతులచే ◆ నజ్ఞానసంసర్గచే
నవరంధ్రాన్వితదుర్గమందు వలలో◆నం బుల్గుచందాన నే
నవలీలం బడి, చిక్కి జీవినయిమో◆హంబంది పోఁజాలమిన్
భవభోగంబులఁజొక్కి,తొట్రువడితిన్◆భ్రాంతింతఁ జేసెన్గదా!
తవులున్మాన్చి,పరేశ!తత్త్వమసియన్◆తత్త్వార్థమైయొప్పునా
శివజీవైక్యముఁ జెప్పి గావుదయనన్◆జిద్రూప, సర్వేశ్వరా.

శా. భూమిందూలితి వాసనానిలహతిన్◆మోహాటవిం;జూచితే!
కామవ్యాఘ్రమహోగ్రము,న్విషయబు◆ద్బువ్యాప్తము,న్నూత్నము
న్భీమాజ్ఞానతమస్సమావృతము నా◆భీలంబు నౌనద్ది; యా
సీమన్ లోభమహాహియుందిరుగుయా◆చింతున్ సదాజ్ఞానమా
జీమూతాదులఁ ద్రుంచి దారిఁగని నిన్◆జేరంగ,సర్వేశ్వరా.

మ. అలినాదోద్ధతిబద్ధకీటకము ని◆త్యంబున్ ద్విరేఫస్థహృ
జ్జలజాతాంచితమూర్తిఁ దేఁటియగు, హో◆చర్చింపబల్చిత్రమా
ట,లసద్రూపముఁజూపుచున్,భ్రమరకీ◆టన్యాయముంబూనినన్
గలనాదంబునఁ జొక్కఁజేయు,మటనా◆కాయత్రియజ్ఞప్తిపో
బలువిజ్ఞానసమాధిముక్తిఁ గనెదన్ ◆ బాలింపు, సర్వేశ్వరా.

శా. పాపాత్ముండను, పాపసంభవుఁడ ని◆ష్పాపుండ నేనాటకిం
కేపాపంబొకో! స్వాంతమించుకయు ని◆న్నీక్షింప దేవేశ; నా

యాపోజ్యోతిపయిన్, దటిద్ద్యుతినిభంబై, యాత్మదాసూక్ష్మమై
చూపట్టంగను, బాపసంగతిని గంచుం, బాపినే నంచు, నే
నేప్రొద్దుంగననైతి; భ్రాంతుఁడను, మోహిఁ? దేవ! నన్బ్రోవుమా
రూపంబు న్గురుమూర్తివై తెలిపి, సద్రూపాత్మ, సర్వేశ్వరా.

శా. నీవే సర్వజగంబు లంటి, నిఁక నిన్నే తల్లిగాఁ దండ్రిగా
నేవేళంగనుచుంటి, నెయ్యమెపుడున్ నీతోనె; నీపై మరుల్;
కైవారంబులు సేతు నీకె, భువినీకై చిత్తమర్పింతు, నన్
గావంజాలినవారు లేరుసుమి నీకన్నన్; నినుం గొల్చునా
కావిజ్ఞాన మొసంగు, కాంతు శివజీవైక్యంబు, సర్వేశ్వరా.

మ. ధనపత్నీసుతకంటకావృతము, సంతాపాదిభూతోగ్రమై
ఘనకామాదిబలిష్ఠచోరజనసంఘంబైన, సంసారకా
ననజీమూతముఁ బాయఁజాలకటతృష్ణావ్యాళదష్టుండనై
పెనుబాధంబడుచుంటిఁ బుత్రుఁడను, నన్ విజ్ఞానచింతామణీ
జనకా! తేర్చిత్రివేణిఁజేర్చితుది, మోక్షంబిమ్ము, సర్వేశ్వరా.

శా. నానాజన్మము లెత్తఁజేసి, భువినానావేషభాషాళిచే
నానారీతుల నందఁజేసి, నను నన్నా! కోరియాడింపవే,
యీనీనాటకసూత్రధారితయు నెంతే వేడ్క నీకైన, నా
నానాంగంబులు డస్సె, వేసరితి, నేనైన యొల్ల నీయాట; వి
జ్ఞానం బిమ్ము తరింతు; నొల్లను పునర్జన్మంబు, సర్వేశ్వరా.

—♦ ఉదయప్రార్థన. ♦—

మ. అట నేఁ బెల్లను మనమెల్లసుప్తినిలయం♦బై పర్వఁగాఁ బుచ్చి, నీ
పటుపాదార్చనమాని నేఁ బిదప, స్వ♦ప్నంబందుఁ గన్పట్టుముం
దటికర్మల్ గని, భీతిమేల్కొని, నినుం♦ధ్యానించి, పెంపారునం
తట, ధీభానురుచుల్ ప్రభాతమున విం♦తల్ దోఁప, సుస్ఫీతమై
స్ఫటికంబై, మెఱుపై, నభంబమరె, నీ♦శా! తూర్పునన్, వీడెఁజీ
కటు లెల్లన్; నినుఁబూజచేసెదను నన్♦గావుము, సర్వేశ్వరా.

—♦ జ్ఞానప్రభాతము. ♦—

మ. కచముల్ కామము; మత్సరంబు సొబగౌ♦కందోయి; కెమ్మోవి
యున్
గుచముల్ రాగము మోహముల్; హృదయమా♦క్రోధంబు; దంభంబె యా
ప్రచురోరుల్; జఘనంబు దర్ప; మలలో♦భం బౌకటిప్రాంతము
న్వచనంబీర్ష్య; యసూయహస్తము; మదం♦బౌనాభియై యొప్పున
ప్ప్రచురాజ్ఞానలతాంగికౌఁగిలి విడెన్ ♦బ్రత్యూషమయ్యె, న్విభూ!
యచలజ్ఞానరుచిప్రసార మిదు; కా♦నన్యుండ, సర్వేశ్వరా.

—♦ రాత్రిపూజారంభమునకు ముందు చేయుధ్యానము. ♦—

మ. నిదురన్ వీడినసాన్నమట్లు నిశి నెం♦తేఁ జేయు ధ్యానంబు, నే
యుదయంబందునఁ జేయఁగామఱచియు♦న్యుక్తంబు యోజింపకే
న్పుదురుక్తుల్ దురితంబులన్ గడపిని♦న్నున్ గానకనాపాపముల్

పదిలంబై కను భానుఁడస్తగిరికిం జాతె న్భయంబందుచున్;
సదయా! పుత్త్రినిఁ గావు మీనిశిని, నన్ సైరించి సర్వేశ్వరా.

మ. ఘనగుప్తుండయి, జ్ఞానభానుఁడట వేగం బంబుధిం గ్రుంకిపో
యిన, నజ్ఞానమహాంధకార మదియెంతే నల్గడల్ గ్రమ్మ, ముం
దున నేఁ జేసినకర్మ, భూతమయి నన్నుం బట్టి బాధించెఁగా
వున నుచ్చాటనకై నుతించెదఁ దలంపుల్మాని నీనామముల్
ఘనవిజ్ఞానసమాధి నిల్పి, నిశి నన్ గాపాడు, సర్వేశ్వరా.

మ. పగలెంతో విపరీతభోగినయి నీపాదార్చన ల్మాని, నా
పగవారిం గడుఁ గూడి, మిట్టిపడి, నేఁ బాపంబులం జేసి, బల్
వగలం గుందుచు నిన్ను డాయ వెఱతున్ బాలింపు మీరేయి నన్
బగసాధింపక జ్ఞానదీప మిడుచున్, బ్రార్థింతు, సర్వేశ్వరా.

మ. ఉదయం బాదిగ నేను చేయునవి యెన్నో పాపముల్గావె, నా
హృదయం బిప్పుడు పీల్చుచున్న వకటా యీరేయి! నాకండ్లు వే
నిదురం బూనవు; భీతచిత్తుఁడను; నా నేరంబులన్ సైఁచి నీ
వు దయం దోడవు, నిద్రపోయెదను నిం బూజించి, సర్వేశ్వరా.

### ఉదయాస్తమయంబులందు చేయవలసిన మానసస్నానధ్యానము.

మ. వ్రతముల్సల్పఁగ లేదు, దానమొసఁగన్ వారాణసీత్యాదులన్
క్షితిఁ దీర్థాటన సున్న చుట్టితిని, సుక్షేత్రంబు లెవ్వంకొ, యే
కతనై నం దలపోయనైతి; యమునన్ గంగాసరిత్వంతిన్ సర

స్వతిలోస్నానముమానితిన్;విడిచితిన్ సంధ్యాదికృత్యంబుల
స్మృతితాత్పుండను, నీపదస్మరణ తత్పర్వ దిక్కు లే దంచు నా
మతిలో నమ్మి తృణీకరించెదను సుమ్మా వాసనల్, మస్తక
స్థితమానాజ్ఞను, నా త్రివేణి,శుచినై శ్రీశైలు నిర్గాల్తు, నా
గతిపో జ్ఞానమొసంగిసత్కృపనుమోక్షంబిమ్ము సర్వేశ్వరా.

(ఉభయకాలములందు చేయవలసిన మానసపూజారంభము.)

— ధ్యానము. —

మ. జనసంఘార్చితకర్మభోగ్యతనుసంజాతోక్తభూతాత్మమా
ఘనసూత్రాంగవిభాగవై భవము నిప్రాపట్య! నీదేకదా!
మనుజుల్ నేరనిగూఁడుకట్టుకొనుసామర్థ్యంబులాపిచ్చుకల్
గన నేర్పించిన మేటి వీవకద! నీకళ్యాణసౌభాగ్యముల్
దనివిం దీరఁగ నెన్న నేరఁ; గొనుమీధ్యానంబుసర్వేశ్వరా.

— ఆవాహనము. —

మ. భువనంబుల్పదునాల్గుఁజేయుపరికృతిప్రోద్భూతభూతుండవై
భువనంబుల్ గడునిండి, భక్తునిమనంబుం జేరుటం దేవ! నే
నవనిన్ మానసరాగమొల్లఁగొని నిన్నావాహనం జేతు, నా
భవముల్ వాపుము, రాగహీనుఁడను, నీభక్తుండసర్వేశ్వరా.

— ఆసనము. —

మ. ఘనదర్పోన్నతభూరివిక్రముల దిక్పాలాదులన్ బీఠముం
దునుపంజాలెదు దేవ! పీఠములు నిన్నున్నపంగ లేవెందు, నా

తనుదేవాలయమందు మస్తకము మ♦ధ్యమై వే సహస్రారమం
దున విజ్ఞానసువేదిపై జననితో♦డ్తో నీదువామ్మాంకమం
దనువై యుండఁగ నాసనంబుగొనుమీ♦యర్పింతుసర్వేశ్వరా.

## —♦ పాద్యము. ♦—

మ. గతజన్మార్జితపుణ్యపాపగతు ల♦గ్రాహ్యంబు లుగ్రంబులై
వెతలంబెట్టఁగ వేసరిల్లితి లస♦ద్విజ్ఞానచంద్రోదయ
స్థితినామానము వీడి; సర్వగతు లెం♦తేఁ బ్రీతి నర్పింతు, స
మ్మతిపాద్యంబుగ వీనిఁగొంచునను వే♦మన్నింపు సర్వేశ్వరా.

## —♦ అర్ఘ్యము. ♦—

మ. వగలొయ్యారములున్మెఱుంగునగలు♦న్వాల్గన్నులుం,గల్లలా
నగుమోముల్ మఱికామమోహమదతృ♦ష్ణల్ గల్గుసంసారమ
న్నొసగనుంజూపి భ్రమింపజన్మతతులం♦దున్ ముంచియజ్ఞానమే
పగ సాధించెదునన్ను; దుర్భరము, వా♦పం దీనినర్ఘ్యంబుగా
జగదీశా! కొనిప్రోవు; మొల్లను బున♦ర్జన్మంబు సర్వేశ్వరా.

## —♦ ఆచమనము. ♦—

మ. పరమాత్మా! తవసన్నిధానజనిత♦ప్రాపంచకోద్ధారచా
తురిఁ జెన్నొందునవిద్యఁగార్యజగ మొం♦తో వింతఁజూపట్టి త
న్మఱిగించున్ మఱపించునిన్న కట! నీ♦మాయావినోదంబునా
తరమాపోల్పఁగనింద్రజాలమిదిత♦థ్యంబౌనె?యీసూక్తులన్
వరదా! యాచమనంబుగొంచునను బ్రో♦వంజూడుసర్వేశ్వరా.

—♦ స్నానము. ♦—

మ. కలకాలంబిటు భ్రాంతిజన్యమతినై ♦ కాయంబు నేనంచు నం
దెలియంజాలక సంసృతి స్రోతల నెం♦తేనొందు నన్గాంచి, యా
తొలితత్త్వంబదె, నీవటంచుగురులెం♦తో వేడ్క బోధింప, నే
నలకాష్ఠాకృతినుండఁ జారువరదం♦సానందబాష్పంబులం
జలకంబాడు మొసంగితిం దనయుఁడం♦సద్రూపసర్వేశ్వరా.

—♦ వస్త్రము. ♦—

మ. క్షరతత్త్వంబపరాహ్వయంబు,పరయాఁ♦జర్చింపనాయక్షరం
బిరుతత్త్వంబులకూటమింగనుపరుం♦డెన్నండుశుద్ధుండదు,దోఁ
బురుషోత్తముఁడు నా, నిరావరణుఁడై ♦పొల్పొందుఁ,బుట్టం
బుగా
వరదా! గైకొనుమీ నిరావరణముం♦బ్రార్థింతు సర్వేశ్వరా.

—♦ యజ్ఞోపవీతము. ♦—

మ. సకలస్థావరజంగమంబులు ప్రపం♦చంబు ల్సమస్తంబులుం
వికసించుం ద్రిగుణాత్మకంబులగుచుం♦విశ్వేశ ! నీసన్నిధిం
శకలంబై లయమొంది పొందు నిను నీ♦సర్వంబు నీవౌట, నే
నకలంకార్పణఁ జేతు, దీనిఁ గొనుచుం♦ యజ్ఞోపవీతంబుగా
సకలాధార! యొసంగు సత్కృపను వి♦జ్ఞానంబు సర్వేశ్వరా.

—♦ గంధము. ♦—

మ. జడమై యొప్పి, ప్రపంచవాసనలఁ గ్లి♦ష్టంబౌచు నీకుక్షిలో
నడుఁగున్మాయయు; వాసనాహతికినై ♦యుగ్రంబునౌ వర్గము

మ్మడి చిత్తంబనుసానశాంత్యుదకసంస్పర్శంబునన్ గంధమున్
వడిఁగల్పించియొసంగెదంగొనుమునీప్రార్థింతుసర్వేశ్వరా.

—— అక్షతలు. ——

శా. దేవా! సత్త్వరజస్తమోగుణసముత్పన్నోద్భవావృత్తులన్
నావాగ్బుద్ధులనుంచి పాపిఁ గనుచున్ నన్బ్రోచి, యీభావన
న్నీవాప్యాయత నక్షత ల్గొనుము; నేనీపూజలం జేసెదన్
జీవన్ముక్తి యొసంగు మన్యమడుగన్ జింతింపు సర్వేశ్వరా.

—— షట్త్రింశతినామపూజ. ——

శా. ఆధారాదిగనాఱుపద్మముల నే నర్పించి పూజింతు నిన్
సాధుస్తుత్య! నిరామయా! నిరుపమా! సర్వాత్మకా! రక్షకా!
బోధాకార! నిరంజనా! విబుధసంపూజాంచితా! శాశ్వతా!
సాధూత్తంస! కృపామయా! గురువిభూ! సద్రూప! సర్వేశ్వరా!

మ. పరమాత్మా! సగుణాగుణా! విబుధహృత్పద్మాలయా! యవ్యయా!
కరుణాకార! కృపాకరా! బుధనుతా! కామాది! విశ్వేశ్వరా!
పరమానందమయా! సనాతన! పరబ్రహ్మేశ! నిష్కారణా!
వరదా! హేపురుషోత్తమా! యచల! హేప్రజ్ఞాన! సర్వేశ్వరా!

శా. లోకాలోకధవా! పరాపరధవా! లోకోద్భవా! ప్రాభవా!
లోకాతీత! యటంచు నిన్మదిని నాలో నమ్మి పూజింతు న
శ్లోకస్తుత్య! సదా సుబోధమతినై లోపంబులం గాంచి య
స్తోకప్రేమ నొసంగు మోక్షమిట సంతోషింతు సర్వేశ్వరా.

## — ధూపము. —

మ. తనుసంభోగధనార్జనంబులును శా◆స్త్రశ్రీప్రతిష్ఠారతుల్
మనముంబిల్చుచువాసనాత్రయమనం◆బ్రఖ్యాతమౌ; వీనిఁబు
ద్ధిని, నిందాస్తుతిఖేదమోదజవిర◆క్తిన్ స్వాత్మసంప్రీతి సం
జనితజ్ఞానశిఖిన్ దహించి పొగ నీ◆శా! ధూప మర్పించెదన్
గొను దీనిన్; ననుఁబ్రోవు దీనునిఁకన◆క్రూరుండ, సర్వేశ్వరా.

## — దీపము. —

మ. పలుజన్మంబులవాసనాఘృతమునా◆వైరాగ్యభాండంబునన్
గలయంబోయుచునింద్రియార్థములతోఁ◆గామాదిషడ్వర్గము
న్బలమావర్తినొనర్చి, యందునిచి, నే◆భద్రంబుగా నీకు ను
జ్జ్వలసుజ్ఞానకళన్ బ్రదీపమిడితిన్◆సర్వజ్ఞ! దర్శించి, వే
బలుదీను న్ననుఁ బ్రోచియిమ్ముదయజీ◆వన్ముక్తిసర్వేశ్వరా.

## — నైవేద్యము. —

మ. తతబ్రహ్మాండపరీతదేహివయి, యం◆తన్ రూపహీనుండవౌ,
కతన న్నెంతమహాదనం బిడఁదగున్◆గర్తవ్యమూహించి, స
మ్మతినర్పింతునివేదనంబుఁగొనుబ్ర◆హ్మాండంబుపిండాండమున్
ధృతినర్పించెదమృత్యువుంగొనుముసం◆తృప్తిన్ సుభోగంబుగా;
మతిఁబానీయమొసంగితిన్ గొనుము, బ్ర◆హ్మానందమున్ జ్ఞానవాః
ప్రతతిన్ క్షాళనకిచ్చితింగొనుము, నిన్◆బ్రార్థింతు, సర్వేశ్వరా.

— తాంబూలము. —

శా. సంబాళించె నొకింతభోజనపరి♦శ్రాంతిన్ శరీరంబు; వే
గం బాళాదిగుణాన్వితంబగు నహం♦కారాదులం బాపఁగాఁ
దాంబూలంబుగ దృశ్యదర్శనయుత♦ద్రష్టృత్రికం బంది సౌ
ఖ్యంబుం గైకొని,ముక్తినిమ్ము దయని♦ష్కాముండ సర్వేశ్వరా.

— హారతి. —

మ. గురువుల్ నాకుఁబదత్రయంబులకునౌ♦గోప్యార్థలక్ష్యంబులం
గరుణం దెల్పఁ, బ్రబోధజన్యమగుసు♦జ్ఞానప్రభన్ భ్రాంతియన్
గురుకర్పూరము వ్రేల్చు,హారతిగఁగై♦కొంచున్,వడిన్నన్ను నీ
దరికిం జేర్పుమటంచుఁ గోరితిని నీ♦ధర్మంబు, సర్వేశ్వరా.

— మంత్రపుష్పము. —

మ. ఘనునాల్గా భువనంబులన్నియుఁ బర♦బ్రహ్మంబ! నీవయ్యు, వే
పదిలంబైతివి యంటకుండ నిను నీ♦ప్రారబ్ధకర్మాదు, లి
య్యదిబలోచ్ఛేద్యము! భ్రాంతికిచ్చితివినీ♦వాకర్మలన్; గంటిలే!
నిదురం బాపెను సద్గురుండు, మది నే♦నీవేసుమాయంటినో
సదయా! పుష్పముగాఁగ దీనిఁ గొనువే♦సంప్రీతి, సర్వేశ్వరా.

— ప్రదక్షిణనమస్కారము. —

మ. పరమాత్మా! తవకాలచక్రమున నీ♦బ్రహ్మాండకోటుల్ సదా
తిరుగుం దాఁ;మటు,కోటిజన్మతతులెం♦తే భ్రాంతిమైఁబొందిసం
సరణన్ నేను పరిభ్రమించుటలె, వే♦సంప్రీతి, నర్పించితిన్
వరదా! దీనఁ బ్రదక్షిణల్గొనుమునిన్♦ బ్రార్థింతు, సర్వేశ్వరా.

## వందనము.

శా. నాలో, భూమిని, నగ్నిలో, జలములో, నాకంబులో, గాలిలో,
నాలోకంబున, ఖంబులోఁ గలయ నీవై, సర్వభూతాత్మవౌ
టాలోచించి, సమస్తభూతతతియా నాబాలగోపాలము
న్నీలోనుండుట, నీకు వారికి నతుల్ నేఁ జేతు నిష్కృష్టతన్
జాలిన్ వీనిని గొంచుఁ గావు, సుతునర్ సంప్రీతి, సర్వేశ్వరా.

## ధారాదత్తము.

శా. నానాకర్మజవాసనాక్షయగతుల్ నాసద్గురుల్ చెప్పఁగా
నానీభేదమెఱింగి, భ్రాంతివిడి, యానందాబ్ధియందుండి, నీ
ధ్యానావాహనలాదిగాఁ బరగుసందర్భోపచారంబులన్
దీనాధార యొసంగి సద్గురుకృపం దృష్టాంతరంగుండనై
సానందాంబువుధారవోతుఁ గొను మత్యంతంబు, సర్వేశ్వరా.

## { పూ జా స మా ప్తి. / మంగళహారతి. }

మ. వరదా! నేశతవందనంబు లిడి, నావైరాగ్యపాత్రింబునన్
భరమౌ కర్మచయంబునంబరగుకప్రింబున్ వెలింగింతు, భా
స్వరనీవారజ శూకసూక్ష్మమగునా ప్రజ్ఞానదీప్తిన్, విభూ!
స్థిరమై, మంగళహారతింగొనుచుఁ దృప్తింబొందు సర్వేశ్వరా.

మ. గరిమన్ బొబ్బిలిచెన్నుపాటికులుఁడై కౌండిన్యసద్గోత్రుఁ
హరిభక్తిన్నన వేంకటేశుఁడతఁ డిం పౌనర్పమాంబా

తరుశీరత్నమునందుఁ గాంచెననువి♦ద్యాహీనుమూఢాత్ముని
న్బరగన్ వేంకటకామశర్మ నగుదున్♦బద్యాళి సర్వేశ్వరా
ఖ్య రహిన్నే శతకంబుఁ జెప్పితిని,భ♦క్తాళిప్రమోదంబుగాన్

మ.పరమాజ్ఞానుఁడ;మూఢుఁడన్;గరుణనా♦పై నుంచిసంప్రీతిమై
పరతత్త్వార్థసులక్ష్యముల్దెలిపి యిం♦పార న్ననుం బ్రోచు, స
ద్గురురాయుండవు,*వేంకటార్య!కొనుమీ♦కున్ భక్తి నర్పింతు శ్రీ
కరసర్వేశ్వరనామమీశతకమున్♦గళ్యాణముల్ గూర్చుచున్

మ. అతఁ డామత్సుమవంశసంభవుఁడు తా♦నారామనారాయణుం
డతిప్రీతిన్ సను హెచ్చరింపఁ బరమై♦యాచంద్రతారార్కమా
శతకం బేను రచించి నామమిడితిన్♦సర్వేశ్వరాఖ్యంబు; నా
హితునిం బ్రోవు మటంచు వేఁడెదను నే♦నేప్రొద్దు సర్వేశ్వరా.

మ. భువివిద్వన్నుతమండపాకకలశాం♦భోరాశిచంద్రుండు స
త్కవివర్యుండగుపార్వతీశ్వరుఁడువి♦ద్వాంసుండుమిత్రుండు,నా
కవితన్ దప్పుల నెల్లఁ దా సవరణం♦గావించి,సంప్రీతిన
న్న వివేకం దరియింపఁ జేయుమహనీ♦యౌదార్యునింబ్రోవఁగా
భవదీయాంఘ్రిసరోజముల్ గొలుతునీ♦భక్తుండ, సర్వేశ్వరా.

---

* వీరు కొత్తవంటి అప్పలనరసింహశర్మగారి ద్వితీయపుత్త్రులు. రాజమహేంద్రవరములో వీరభద్రాపురవాస్తవ్యులు. ప్రస్తుతము మహానందిక్షేత్రమునందు తపస్సు చేయుచున్నారు.